ఓమ్.

శ్రీ మహేశ్వరపరబ్రహ్మణేనమః

# మహేశ్వరశతకము.

గీ. జగమునందున ధనమునద్వైతమనుచు । ఆత్మయందున
భావ మద్వైత మనుచు । గురువు నందున క్రియయె
నద్వైతమనుచు । దెల్పుచుండిరి పెద్దలు తెంపుగాను.

వ. కావున లోకమందు మానవులు క్రియ గనలేక యీసంసారము గొప్పయని దారాపుత్రసోదరులనే వలలో దగులుకొని పరమునకై పాటుపడనేరక పంకమునందు బడిన మార్జాలముపగిది దరిగానలేక నమసిపోవు విధంబున యీ మాయజాలమందు జిక్కి మనలను రక్షించు పరమాత్మను మరచి తుదకు శమనచే జిక్కుటకంటె సద్గురువు నాశ్రయించి మంత్రోపదేశముపొంది సదా స్మరణమనన నిధిధ్యాసములచె భగవంతునిపూజించి తరించుటయె ముక్తి సాధనంబుగాన భక్తిగలవారలై భగవంతుని ధ్యానింప వలయు.

ఉ. ఎవ్వడు లోకమెల్లసృజియించి। జగంబున లీలరూపమై।
యుండినయాపరాత్పరుడు। స్థావరజంగములందు నాత్మ
యై । నటనలుసల్పుచున్నయటు । నామదిసంతసమంది
అవ్వలన్ । తత్వము దాసదరూపమని । దలచి ముదం
బున వేడుచుండెదన్.

కం. విద్యలకు నాదిగణపతి - ముజ్జగముల వేల్పువనుచు
ముందుగ దలతున్ - రంజనచేయుమి నామది- సజ్జన
పోషకుడ నీకు జేతు నమామి.

కీర్తన-మలయమారుతము-ఏకతాళము.

విద్యలకాదివి గణాధిప । సజ్జనపోషక వినాయక । గుజ్జువేల్పనిను కోరిభజించెద। గజముఖ నేకదంతగావుమి। శుక్లాంబరధర గణాధిప । కొక్కుతేజిగల వినాయక । లోకాధిపశ్రీ ఆదిమూర్తివసి । జోకతొ కొనియాడెదను సాకుమి॥వి॥ హిమగిరిజాసుతగణాధిప । ప్రమదాదులకాదివి వినాయక । చామరకర్ణచతుర్భుజాహార ప్రేమతొ బ్రోవవె పరాత్పర ॥వి॥ వంకరతుండము గణాధిప । నాజంతులు బాపుమి వినాయక । పొంకమలర కొనియాడెదనాకవి । పొందుగజేయుమి ఇందుమౌళిహార ॥వి॥ ఏకదంతశ్రీ గణాధిప। లోకపూజ్యాడవు వినాయక। నాకవినుత జంబూఫలభక్షణ। వెంకటదాసా వరదాఫణిధర ॥వి॥

క౦. పద్మజునిరాణి మ్రొక్కెద। ముద్దుగనాకోర్కె లొసగుముదమున జనని। దిద్దవె నాపొరబాటులు। వద్దికతొ నిన్నుగొలతు వనరుహనేత్రి.

క౦. హరిసతి కలుముల పైదలి । నిరతము నిను వేడుచుందు నీరజనేత్రి । సిరులొసగి ఆదరింపుమి। మరుజననీప్రేమమీర బ్రోవగదమ్మ.

క౦. ముక్కంటి వెలది మ్రొక్కెద । గ్రక్కున మొరనాలకించి గావగదమ్మ । పెక్కులు పొగడగనేరను । చిక్కులు బెట్టంగరాదు శ్రీశివచెండి.

క౦. వందనము పండితులకును । వందనమమరులకు నాదివగణంబులకున్। వందన మాచార్యులకును । వందనమిదె జేతు నాదు డెందమలరగన్.

సీ. నా జన్మస్థానంబు నయముగ దెల్పెద । వినరయ్య జనులార వేడ్కమీర । ధరయందు రాజోలు తాలూక చేరిన । యిరువుగ గోగనమఠ పురంబు । వహ్నికులంబున వంశంబు కొక్కెరగడ్డ రఘుకులగోత్రంబు రమ్యముగను । జనకుడు సుబ్బయ్య జనని శ్రీ బ్రహ్మాంబలకు జ్యేష్టసూనుండనై జనించి । నాదు నామంబు వెంకటరెడ్డనంగ । పిలచుచుందురు మానవుల్ ప్రేమ మీర । బాల్యముననుండి భక్తులసేవ జేయ। నామనంబున భక్తియుక్తంబు గల్గె.

వ. కులనామము యిటుల వ్రాయుటకు కారణమేమని అనెదరేమొ, యీ కులమునకు పర్యాయనామములు కొన్ని గలవు. యేవనిన అగ్నికులక్షత్రియులని వహ్నికులక్షత్రియులని పల్లవులని పల్లిలని మరకాండ్లని వాడబడుచున్నదిగాన, "వైశ్వానరోనరోవహ్నిర్వీతిహోత్రో ధనంజయః" అమరవాక్యమునబట్టి బాహ్యములో వహ్నికులమని వ్రాసితి. యిందుకు అంతరార్థమున కులముదెల్పుచున్నాను.

తత్వకీర్తన-సావేరి-ఆదితాళము.

యేకులమని యోచించెదరో యీ వివరముదెల్పెద లోకులకు । రాకపోకల రహస్యమెరిగి యేకమైయున్నది నాకులము ॥ప॥ జ్ఞానమనే వల చేత బట్టుకుని । ఆపముగల యీ మడుగులోపల। పాపలనడుమను చేపలుబట్టి । బ్రతుకుచున్నది నాకులము ॥ప॥ వాటముగా యీ సప్తనదులలో వేటాడేది నాకులము। నూటిగ త్రికూటమందున జేరి పాటలు పాడేదీకులము ॥ప॥ ఆత్మనాత్మల భావంబెరిగి అది గన్నది

నాకులము । నిత్యము సోహంబనెడినావ హెచ్చుగనడిపింది యీ కులము ॥ఏ॥ చింతలతోటలో చిన్మయకారుని చేరి యున్నది నాకులము। అంతరంగమం దనుభవమెరిగీ అంతా నిండిన దీకులము ॥ఏ॥ యిరువదినాలుగు పోగుల సూత్రము వలలు అల్లెది నాకులము । పరమపావనసంబైన మీనమును పట్టుగబట్టిందీకులము ॥ఏ॥ యెక్కువైనది లోకమందున ఏకాక్షరియే నాకులము ॥ మక్కువలర గురుమర్మము గని పరిశుద్ధమైనది నాకులము ॥ఏ॥ ఆరుమెట్లపై అంబను గూడి ఆనందించేదీకులము । నడిమికంటిలో నారాయణుగని నమ్మి భజించేదీకులము ॥ఏ॥ కుడియడమలలో గుర్తుదెలసి బహు గోప్యముగన్నది నాకులము । తడయకమూలస్థానమందున। నాదమువిన్నది యీకులము ॥ఏ॥ అరయగ శ్రీ భద్రాద్రి యందున యిరువుగ నాదికాపురము । స్థిరముగ కొక్కెర గెడ్డ వెంకటదాసు దెల్పె యీ యంతరార్థము.

గీ. యెన్ని చదువులు చదివిన నేమి॥ ఫలము । తన్ను దెలి
యంగ చదువుట తథ్యమనుచు । మున్ను పెద్దలు వ్రాసిన
చరితములను । విన్న నామది సంతస మొందియుండ.

గీ. నాదు పుణ్యావశంబున నాణ్యమయిన । మోదమలరగ
గురువచ్చె ముందుగతిచె । ఆదరించియు నను చేరదీసి
యెంతొ । పొందుగాదెల్పె నద్వైత భావమెల్ల.

గీ. సాంఖ్యతారక అమనస్క సహితమెల్ల। అయిక్యమొం
దగ దెల్ప ఆనందమొంది । మక్కువలరగ కవివ్రాయు
మనసుగల్గ । శక్తికొలదిగ చరితముల్ చెప్పచుంటి.

సీ. భక్తులకానంద మొందగ ప్రథమమున। భక్తజనానంద మనె చరిత్ర। యుక్తికొలదిగ వ్రాసియుంటిని తదుపరి। రామాంకితంబుగ రామశతకం। గురుకటాక్షంబునమరి నాత్మభావంబు। తత్వములుగా వ్రాస్తి శక్తికొలది। యిదియు నీశ్వరకంకితం బమర జేసి। మోద మలరగ రచియిస్తి సదయులార। నాదుతప్పులుమన్నించి నయముగాను। వాదులెంచక దయజూడ కోరినాడ.

కం. కావ్యములేమియెరుంగను। భావమునం దిచ్ఛగలుగ పలుకులవెలది। నాయడదయబూనగమది। కీవిధమున గవియొనర్తు ప్రేమలరంగన్.

కీర్తన-నాదనామక్రియరాగము-అటతాళము.

ఈశ్వరధ్యానము చేయవె మనస - యితరయోచన నొల్లకెమనస - శాశ్వతపదవి కోరవెమనస - చెప్పితినని కోపించకె మనస ॥యీ॥ దుష్టులచెలిమి చేయకె మనస - కష్టములధికము కలుగునెమనస - నిష్టచెగురువుల కరుణచె అనయము నిటలాక్షునిపూజించవె మనస ॥యీ॥ ఆర్గురు దొంగలు నీకై మనస - మార్గణముగాచి యున్నారెమనస దీర్ఘకాలమని మురయకెమనస - నిర్గుణంబులో నిలువవె మనస ॥యీ॥ ఎగ్గుతగ్గులు నెంచకె మనస - దగ్గరదారి గనవలెమనస - ముగ్గురుముచ్చటలేలనెమనస - సిగ్గులేక చరియించకెమనస ॥యీ॥ యితరతప్పులునెంచకెమనస- సతతముభజన సల్పవెమనస - అతిరహస్యమిది అందవె మనస - మతియందునమరిగుండవెమనస॥యీ॥ ముఖ్యము గురుమూలంబున మనస - చక్కగ తెలియవలె గద

మనస - వెంకటదాసనుభవ మిది మనస - శంకలేక చే
కొనవె మనస.

వ. శ్రీమహేశ్వరాంకితముగా వ్రాయు కందపద్యములు.

కం. శ్రీపార్వతిమనోహర - ఆపదలెడబాపుమయ్య హర
శివశంభో - కాపాడి దరినిజేర్చుమి - నీప్రాపేజొచ్చి
యుంటి నయ్యమహేశ.

కం. వందనమునురగభూషణ - కందర్పహారిణయిందు ధర
కరుణాంగ - డెందంబున కొనియాడెద - పొందుగ
మొర నాలకించి బ్రోవుమహేశ.

కం. మనసురంజిల్ల నీకృతి - పనిబూని జేయగోరి పద్యం
బులుగా - వినయమున వ్రాయుచుంటిని - కనికరమున
తప్పులున్న గావుమహేశ.

కం. త్రిపురాసురసంహారక - కృపజూడుమి దేవదేవ కో
మల దేహ - అపరాధిని నెపమెన్నక - సఫలమునొం
దించునాదు కోర్కె మహేశ.

కం. అరపదిమోముల వేలుప - సురనుతగౌరీశరజిత పర్వత
వాస - హరహరభవహరశంకర - కరుణాకరపొగడ
నెంత వాడమహేశ.

కం. గురుభావంబున నామది - అరయగ నీలీలగనిన ఆనం
దముచె - స్మరియింప నీవశంబున - పరమునకై పాటు
బడుచు నుంటిమహేశ.

కం. రేపుమాపనక వెలిగె దీపమునీరూపమగును తేజమలర
గన్ - చూపులలోచూపుజూచిన దావున గనవచ్చు
నిన్ను తనలో మహేశ.

కం. గంగధరలింగరూప - భృంగీశ్వర భక్తపాల బుధజన లోల - అంగన అర్ధశరీర - శృంగాటకవాస నంది కేశ మహేశ.

కం. జక్కులదొర చెలి నినునె - పెక్కులు కొనియాడ నేర పేర్మిలరంగ - దిక్కులు నీవై వెలిగె చుక్కలదొర మౌళిలోక నాథమహేశ.

కం. దిక్కెవ్వరు భువనములకు - దిక్కెవ్వరు జీవకోట్ల దీనుల కెల్లన్ - దిక్కునీవనుచు నమ్మియు - మక్కువతో గొలతు నాదుమదిని మహేశ.

కం. యెందెందు వెదకిచూచిన - నందందే నీదురూపు నయముగ నొప్పన్ - పొందుగ నాధారంబై యుండువునిను గాన నెవరివశము మహేశ.

కం. యెనుబదినాలుగులక్షల - తనువులు నీ మాయవలన చెలగుచునుండన్ - ఘనమయిన నీదు తేజము - అణువుగ నేర్పరచి అమరినావు మహేశ.

కం. ఎంతదయో నీదాసుని - పంతంబున దండధరుడు పట్టగ వానిన్ - సుంతలో శూలముచె - నీవంతము నొందించితివిగ దయ్యమహేశ.

కం. నీ అయిదు అక్షరంబులు - బాయక పఠియించె భక్తవరులకు దయతో - సాయుద్య మొసగి యుంటివి - మాయాప్రతిబింబమెంత మహిమ మహేశ.

కం. పాపలలోపల వెలుగై - యేపారగ లోకమంత నేలెటి దొరవై - చూపులో చిదూప్రుడవై - బాప్రుగ నెవ్వరికి గానరావు మహేశ.

కం. స్వరమయుడ సర్వేశ్వర - నిర్వికారుండ నీలకంఠ
ఉమేశ - యుర్వికి నాధారుడవై - పురిలో భిక్షంబు
నెత్తినావు మహేశ.

కం. మున్ను మార్కండ భక్తుని - విన్నపమాలించి బ్రోచి
నటువలె నన్నున్ - కన్నడశాయక బ్రోవుమి - పన్నగ
ధర జేసికన్న వేల్పుమహేశ.

కం. కామహరసురలునాదిగ - నీమాయలు కనుగొనంగ
నెంతటివారల్ - పామరుడను జడుడనుశివ - ప్రేమతో
నాబాధలెల్ల బాపుమహేశ.

కం. బ్రతుకెంతో నెరుగజాలక - సతి సుతులే ముఖ్యమ
నుచు చాలగభ్రమసి - సతము నిను దలచనేరని -
మతిహీనులు శమనగతికి జేరుమహేశ.

కం. అనలము ఫలమని భ్రాంతిని - శలభము దానందు
జొచ్చి సమసినరీతిన్ - మానవుడు సంసారంబున -
కానక చెరియించికడకు చెడునుమహేశ.

కం. తృష్ణచె మావుల ఉదకము - నిష్టంబుగ ద్రావనోరు
మృగముల పగిదిన్ - వట్టిది సంసారంబున - కష్టించి
పరముగాన లేరుమహేశ.

కం. ఆత్మతాననుచు మెరుగక - భూతవికారముల నొప్పు
కాయము మరిగి - నాతనువె గొప్పయనుచును - ప్రీ
తిని గొనియాడు పామరుడు మహేశ.

కం. తోయమునం దింపినఘట - న్యాయంబుగ లోకమంత
నమరినభంగిన్ - వెయ్యొడలనిండినీవె - కాయక విల
సిల్లుచుండు బరగి మహేశ.

కం. మోక్షాపేక్షను మనుజుఁడు - దీక్షతో నీ అక్షరములు
నెంచి స్మరించి - సాక్షిస్వరూప మరసియు - రక్షక
నీపదవి నయము నొందుమహేశ.

కం. తాపత్రియంబులనియెడి - పాపపు శత్రువుల ద్రుంచి
నీపదభక్తిన్ - రేపుమాపనక సల్పిన - ఆపదలను
బాసి పరము జేరు మహేశ.

కం. మనసేంద్రియములు చెదరక - అనిశము పరమాత్మ
యందు సలరినచిత్తం - పనిబూని నిల్పియుండిన -
ఘనులే నినుజేరు గౌరినాధ మహేశ.

కం. అస్థిరమయినది దేహము - మత్తులునిది గానలేక మ
మతజరించి - విత్తమె పుణ్యంబనుకొని - తత్తరమున
శమనచేత జిక్కు మహేశ.

కం. అరచేత ఉసిరికాయను - మరువుగ బిగబట్టినట్లు అర
యగధీరుం - డనువాడు కామశత్రుల - స్థిరముగ దా
వశముచేయ గలడు మహేశ.

కం. సద్గురువు కటాక్షంబున - ముద్దుగ దాసులకు ముక్తి
దెల్పినరీతిన్ - భ్రమరంబు వేరె పురుగును - క్రమ
ముగ తనరూపుజేయ నగును మహేశ.

కం. అంధునికి రమునదీపము - పొందుగ నొరులకునుకాంతి
నిరవగునట్లున్ - ముదమున లోభిగణించిన- ధనమిత
రులపాలుగా దె ధరను మహేశ.

కం. కుసుమంబు నుద్భవించిన - విశదముగా పరిమళంబు
వెలయును ధరపై - శిశువు గుణవంతుడైనను పసితన
మున దెలియువాని ప్రజ్ఞ మహేశ.

కం. నళినీపత్రము నుదకము - అలమృత్తువునందు పురుగు
నంటనివిధమున్ - యిలతనువులందు నీవై - మెళకువ
గా నిమిడియున్న ఘనుడమహేశ.

కం. ఇనుమున అంటిన అనలము- పనివానిచె సమిటిదెబ్బ
తిన్నట్టులుగ - విసయమున దుష్టచెలిమిని - ఘనులుం
డిన కష్టమొంద సగునుమహేశ.

కం. గంపెడు గులకలు యుండిన - తెంపుగ నొకరత్నము
నకు తేజంబగునె - పెంపలర తార లున్నను - సొం
పుగ చంద్రునకు చాలలేవుమహేశ.

కం. శ్రీగంధతరువుచెంతను-చేరినరుహాములకువాస నబ్బిన
రీతిన్ - సుగుణుల సహవాసంబున-గుణహీనుల కబ్బు
మంచిగుణము మహేశ.

కం. తాసంపాదించిన ధన- వీసము తినలేక దాచి నితరుల
కిచ్చున్ - మక్షికము తేనెగూర్చియు- యిచ్చునుతా
దినక యొరుల కిలనుమహేశ.

కం. వక్కటిదివ్వెచె మరిమరి - పెక్కుగ దీపములు వెలుగు
అరయుగ ధరలో- చక్కని సోమునివల్లను- దిక్కులు
వెలుగొందు తేజ మందిమహేశ.

కం. సూదంటిరాయి సూదిని - మోదంబున చేరదీసి నం
టినవతుగా - ఆదరణచేసి భక్తుల - నీదరిజేర్చెదవు
దయతో యీశమహేశ.

కం. మసిపాతను కట్టినమణి - యుశమును పాడౌనె యెన్ని
విధములనైనన్ - భాసిల్లుచున్నజ్ఞానికి - గాసిలుజెంది
నను లెక్కగొనడు మహేశ.

కం. సిలలున్ మ్రాకులు లోహము - మలచి బొమ్మలుగ
జేసి మహిలో జనముల్ - పలువిధముల ప్రార్థింతురు-
యిలలో దైవంబటంచు నెంచిమ హేశ.
కం. గురుపూజచేసి గుర్తులు - నెరిగినధరలోన నరుడు దై
వంబతడౌ- మరికరుకు రాళ్ళపూజలు-నెరనమ్మి చేయ
నేమి ఫలముమ హేశ.
కం. దేహంబు నీళ్ళకిడిగిన - మోహంబున జడధరించి మె.
ప్పాగనెంతో - ఆహారముడిగియుండిన - సోహము నె
రుగకను సిద్ధిగాడు మహేశ.
కం. అణువునెరింగిన అక్షరమెరుగును - ప్రణవంబునెరుగ
ప్రజ్ఞానంబౌ - తనువెరిగిన తత్వంబును - గనిమోక్ష
మునొందు జ్ఞానికడకు మహేశ.
కం. మనముచెరించిన తనలో - మనమున రెండక్షరములు
స్మరియింపక - యీ తనువు నేననెడువారలు - కను
గొనలేరయ్యనిన్ను జడులుమ హేశ.
కం. పవనములో దీపమువలె - భవమున తల్లడమునొంది
బహుబాధలచె - భావమున నిన్ను దలచక - కేవల
ము . యమునిపురికి జేరుమ హేశ.
కం. యెన్నిదినంబులు పెంచిన - కొన్నాళ్ళకు తనువునున్న
కోరికలేల - యున్నది మార్గము కనుగొని- పన్నగ
- ధరనిన్ను జేరవలెను మహేశ.
కం. ఇతర దైవముల వేడను- గతినీవెయనుచు పతిత పావన
సతతం - మదిదలచి నీదునామము - నిరతము స్మరి
యించుచుంటి. సయ్యమ హేశ.

కం. బూటకమయిన ప్రపంచము - సూటిగ గల్పించి నెం
తో చోద్యమలరగన్ - నాటకము సల్పుచుంటివి -
కాటికి కాపరివైన ఘనుడ మహేశ.

కం. అంగవిహీనునిహర - భృంగీశ్వరలోకపాల బుధజన
లోల - నింగిశిఖయైన దేవ - జంగమువై భిక్షమెత్తి
నావు మహేశ.

కం. యవ్వనిచె బుట్టుజగములు - కవ్వని కత్రుంబొసంగి
గాచినధీరుం - నివ్వరసూక్ష్మమున వెలిగె-అవ్వలతత్వం
బు వలతు నయ్య మహేశ.

కం. నాలుగుమహావాక్యంబుల - కీలెరిగినట్టి యోగి క్రియ
గనితనలో - మేలగు నీసాయుజ్యము - ఫాలాక్షుజెంది
యుండు పరముమహేశ.

కం. కూపములో మండూకము - దాపునదరి గాంచలేక
తడబడుసటుగా - పాపశత్రువుల జిక్కియు - ఆపద
లను బొందునరుడు అయ్యమహేశ.

కం. జాలకుడు చర్మయంత్రము - నాటకములు సల్పునల్లు
నయముగ నెంతో - లీలాస్వరూప నీవీ - జీవుల నా
డించుచుంటి వయ్య మహేశ.

కం. గురుదైవంబుగ నెంచక - పరమందగ జ్ఞానబోధ గను
గొనవశమ - గురుతులు పెట్టుక తిరుపతి - గిరులుచ
రించంగ నేమి గనును మహేశ.

కీర్తన-ధన్యాసి రాగము-ఆది తాళము.

నిరాకరించకు శరణుజొచ్చితి నీలకంఠవరద - ప
రాకు శాయక మొరాలించుమి - పరమదయాకర పన్నగ

భూషణ ॥ని॥ భక్తులపాలిట బహుభాగ్యంబని - ముక్తికోర కునే మొక్కివేడెదను ॥ని॥ నిటలాక్ష నీ మటుమాయలు గన నెంతటివాడనుర - వట్టిదిజగమునద్రోచి నన్ను నీ వద లుట యిదిమేర ॥ని॥ మిత్తిగొంగశ్రీ గౌరినాధ నీ చిత్తమె భాగ్యముర - ఎత్తెరంగున బ్రోచెదవో నను క్రొత్తగజూ డకుర ॥ని॥ జక్కులరేనిచెలి గంగాధర దిక్కునీవెగదర - గ్రక్కున కొక్కెరగెడ్డ వెంకటదాసుని గావుముర ॥ని॥

మంగళహారతి-సురటరాగము-ఏకతాళము.

భుజంగధరునకు మంగళహారతి । అంగన లివ్వారె రంగుగను॥ కామహరునకు కైలాసునకు । నీలకంఠునకు సూలపాణికి॥ విశ్వధరునకు విశ్వేశ్వరునకు । వాకదాల్పు నకు వలిమిలల్లునకు॥ అర పదిమోముల ఆదిత్యునకు । సు రనుత శ్రీ గౌరీనాధునకు॥ మినుశిఖయైన మిత్తిగొంగనకు । గంగాధర శృంగాటవాసునకు॥ ఫునుకదాల్పు వెనకయ్య జనకునకు । లీలస్వరూపశ్రీ ఫాలనేత్రునకు ॥భు॥ యిందు ధరునకు నందికేసునకు। పొందుగ వెంకటదాసువరదునకు॥

ఆత్మభావము—ద్వితీయభాగము.

ఓన్నమస్సివాయని తోలుతనే ఓంకారస్వరూపుని। మనమునదలచి శరణుజొచ్చితిని మన్నించుమీ మహేశ॥ సర్వభూతములందున సమముగా నెలకొన్న నిర్వికార। యుర్విలోనన్ను గానశక్యంబె నెవ్వరికి శ్రీ మహేశ॥ చెప్ప బూనితిని నాదుఅనుభవము తప్పు లెంచ్నకను దయతో। వప్పుగా నాయందున కృపబూని నేలుమి శ్రీ మహేశ॥ పె ద్దల దయచేతను నద్వైతభావంబు తెలియకోరి। ఒద్దికతో

గురుమూలముగని మోదమందితిని శ్రీ మహేశ॥ డెందమందున ఆర్యుల పాదపద్మంబులు కొనియాడెద । విద్యలకు నాదియైన గణపతిని వేడెదను శ్రీమహేశ॥ ఘటశోధనంబు క్రమముదెలసినే వివరింతుదీనివిధము । నిటలాక్ష నాయందున కృపబూని నేలుమి శ్రీమహేశ॥ కొంచెమనకను విద్యయు గొప్పగానెంచి నాయడను దయతో । అంచవాక్యములరీతి ఆలించ వేడెదను శ్రీమహేశ॥ గొప్పకొరకై చెప్పగా దలచినే నొప్పగా వ్రాయలేదు । ఎప్పుడు నీనామము దీక్షతో ధ్యానమని శ్రీమహేశ॥ నాదు అనుభవమిట్లుగగని నంతమోదమున దెల్పుచుంటి । వాదు లెంచక ప్రాసలు గలిగున్న నీదె భారము మహేశ॥ సుక్తిరజితము భ్రాంతిచె సమ్మి నటుయుక్తముని సంసారము రక్తితో నమ్మి కడకు శమనచె జిక్కగద శ్రీమహేశ॥ పరమాత్మ తానెయనుచు జీవుండుభావించి తెలియతేక । నిరతము యీదేహమె తానుచు నమ్మియుండును మహేశ॥ తొల్లిజన్మంబులెన్నో పరికింప తల్లులెందరు తండ్రులో । కల్లసంసారమందు మరిగి కనుగొనలేరు శ్రీ మహేశ॥ ప్రారబ్ధవశమువలన మరి మరి జన్మంబు లెన్నొయెత్తి । ధరను సుడిసీటయందు కీటకముతిరుగు మాట్కిని మహేశ॥ పశుపక్షి క్రిములాదిగ తనువులు వసుధపై నుద్భవించి పసిరికాయలురీతిని బడిపోవుచుండు గద శ్రీమహేశ॥ నిద్రయందునస్వప్నము ఆపమున బుద్బుదంబుల మాట్కిని । యింద్రజాలమురీతిగా గన్పించు యీ జన్మములు మహేశ॥ నమ్మరాదీదేహము నెంచంగ పవనమందున దీపము । బొమ్మలాటల యంత్రము వట్టిది సంత

కూటము మహేశ॥ విగ్రహారాధనలను యిలయందు జేసె
దరు భద్రముగను । బాగుగా వరములిచ్చునని భ్రాంతి
నొందెదరు శ్రీమహేశ.॥ సతిపతులు రతిశాయగ రేతస్సు
రుధిరమందున గలసియు । గతజన్మవిధివశమున పుడమిపై
నుదయించు శ్రీమహేశ॥ అర్భకత్వమున మూత్రమలము
లను బొర్లాడు కొన్నినాళ్ళు । బాల్యసంధానమందు బహు
చేష్ట లొప్పుచుండును మహేశ॥ నీమాయగానలేక బాల్య
యావ్వనప్రాయములు గడపుచు । పామరంబునజలంగినిను
మరచి వ్యర్థులగుదురు మహేశ॥ వృద్ధాప్యమున దేహ
ము బలముడిగి లేవలేనను యెంతో।మూర్ఖులై జాలినొంది
సమవర్తిపురి జేరు శ్రీమహేశ॥ యీ నటన లోకమందు
వివరించిచూడ నా మనమునందు। యేమిదోచక యోచన
జేసితి నొప్పుగా శ్రీ మహేశ॥ పెద్దల వాక్యములనువిని నా
మనంబున మోదముననను । సదమలాచారిత్ర నీచెరితముల్
చదవంగ శ్రీ మహేశ॥ భక్తివైరాగ్యమాది గురు భావ
మున శక్తి కొలదిగాను । కాయంబు తరచిచూడ తత్వంబు
కనుగొంటి శ్రీమహేశ॥ ఆరుఅంగములుమూసి యోగంబు
చేయుగా మేరువందు । పూర్ణమైనట్టి కళలు నీచాయనొప్పు
చుండును మహేశ॥ అంగలింగాంగములను నొకటిగా యేక
మయి సంగమునను । మంగళప్రదముయైన కళలంటియుం
డుగద శ్రీమహేశ॥ షడచక్రములయందున కీలెరిగి హం
సాక్షరిని జపించ । యడబాయకను ప్రణవము గూడి ఆలిం
చనగు శ్రీ మహేశ॥ యిడపింగళనాడులన్ బంధించి చూ
డవలె నడిదారిలో । జోడునొకటిగ జేసిన అవ్వల చోద్య

ముల్ శ్రీమహేశ॥ దండైన ఓంకారము దశనాదములు చెలంగుచునుండును । పండువెన్నెలలో వెలిగె పరకాంతజంధనగు శ్రీమహేశ॥ వారణాసీ తీర్థముల్ తెచ్చిన వనములెల్లా తిరిగిన । కారణగురు జేరక నిను గాంచగాలేరు శ్రీమహేశ॥ కాషాయములుకట్టిన జడలు బహు ఘనముగా ధరియించిన । వేషముల యుక్తిబూని జనుల మోసము చేయుటకు మహేశ॥ పంచవింశతి వివరముదెలసి పరమాత్మధ్యానముచేయుచు । అంచితంబుగ షోడసితత్వమై యుండవలె శ్రీమహేశ॥ సోహమని అక్షరముల వాత్యంబుసొంపుగా స్వాజ్ఞదెలసి । మోహంబురోసి జ్ఞాని అనయమునిన్నంటియుండు యీశ॥ నీమాయ నీజాలముల్ కనుగొనునె యెంతటివారలైన । పామరము గల్పించి యీ నాట్యంబుసల్పుచుంటివి మహేశ॥ యేమిజన్మము జీవనం ప్రారబ్ధమెంతో తెలియంగరాదు । స్వామి నీదరినిజేర్చి రక్షించు చాలు జన్మలు మహేశ॥ వింతవింతలుబొమ్మలు మూనాళ్ల కెంతజేయును తంతులు । షంతకూటంబు వతుగా విడిపోవుచుండుగద శ్రీమహేశ॥ తనువులస్థిరములయ్యె మోహంబు ధనరాసులెల్ల కల్ల । కన్నుమూసినగానవు యిదియెంత చోద్యమయ్యెను మహేశ॥ సాఖ్యమూలంబు చదివి దేహంబు సాధించి యున్నవాడ । ఐక్యమొందగ మనసున తారకము నంటితిని శ్రీమహేశ॥ అమనస్కయోగమునను క్రమముగా సల్పితిని విమలముగను । భ్రమ వీడి బయలందున జెందుంటి భద్రముగ శ్రీమహేశ॥ ఆదియందున బ్రహ్మము అంబరాకారమున వెలసియుండి । యేదినంటక నిర్గుణంబె

యుండె నెలమిగను శ్రీమహేశ॥ ఆనిర్గుణంబునందు అవ్య
క్తమను మాయ నుద్భవించి । అట్టి అవ్యక్తమందు మహా
తత్వ మమరెగద శ్రీమహేశ॥ ఆమహాతత్వమునందు అహం
కారమునుగలై అహమునందు । మూడుగుణములు బుట్టెను
నొత్సంగ మోదమున శ్రీమహేశ॥ అ అనే అక్షరమున రజో
గుణయుక్తునగు బ్రహ్మయ్యెను । ఉ అక్షరంబునందు సత్వ
గుణవిష్ణువగు శ్రీ మహేశ॥ మ అక్షరమునందు నదమో
గుణంబున యీశ్వరుండయ్యెను । సృష్టిస్థితిలయ కారకుల్
బుట్టిరిసాపుగను శ్రీమహేశ॥ మూటియందున నైదుగ
తన్మాత్ర లేర్పడెను లోకమందు వాటియందున భూతముల్
నైదుగల్పింపబడె శ్రీమహేశ॥ సజ్జోముఖంబునందు పృథి
వుద్భవించి వామముఖంబున । జలభూత ముద్భవించి జగ
మెల్ల వ్యాపించె శ్రీ మహేశ॥ అఘోరముఖమునందు అన
లంబు బుట్టి పురుషోద్భవమున । అనిల ముదయించి లోక
మందు నకృమముగను శ్రీమహేశ॥ యీశాన్యముఖమునం
దు గగనము యేర్పడియుండగాను । పంచభూతములుగలసి
ప్రపంచమాయెగద శ్రీ మహేశ॥ భూతమున కొక్కొంటికి
నైదేసితత్వంబు లమరియుండె । నాతత్వముల నెల్లను వివ
రింతు నయముగను శ్రీమహేశ॥ శ్రోత్రత్వక్కుచక్షువుల్
జింహ్వఘ్రాణంబులు నైదుగలసి । జ్ఞానేంద్రియంబులుగను
గల్పింపబడెనుగద శ్రీమహేశ॥ వాక్కుపాణిపాదముపాయు
ఉపస్థలైదుగూడియు । కర్మేంద్రియంబులుగను గల్పింప
నాయెగద శ్రీమహేశ॥ శబ్దస్పర్శరూపము రసగంధములు
నైదుగలసి మరియు । విషయేంద్రియంబులయ్యె పంచత

న్నాత్రిలుగ శ్రీమహేశ॥ జ్ఞాతమనసుబుద్ధియు చిత్తహంకా
రములు నైదుగలసి । అంతఃకరణము లయ్యెను అవనిలో
జీవులకు శ్రీమహేశ॥ ప్రాణపానాఉదానా వ్యానసమాన
ములు నైదుగూడి।పంచవాయువులయ్యెను ఎంత్సంగతనువు
లకు శ్రీమహేశ॥ రుధిర మేధోమాంసము హాస్తిమజ్జరో శ్లే
ష్మంబులు । సప్తధాతువులయ్యెను ఘుటమునకు ఉత్తముగ
శ్రీమహేశ॥ అన్నమయ ప్రాణమయము ఆనంద విజ్ఞాన
మనసుగలసి । పంచకోశములయ్యెను నీమాయ అంచితం
బుగ మహేశ॥ ఆధారస్వాధిష్టము మణిపూరకము అనా
హతవిశుద్ధం । ఆజ్ఞేయములు నారుగచక్రంబు లమరుంజె
శ్రీమహేశ॥ ఆధార చక్రమందు నాల్గు దళములు వ. శ.
ష. స. అను బీజముల్ అపరంజచాయ ఆరునూర్లు గణప
తికిహంసలు మహేశ॥ స్వాదిష్టచక్రమందు షడ్దళంబులు
నారు బీజములతో పగడంపుచాయనొప్పి । బ్రహ్మకార్వేలు
హంసలు మహేశ॥ మణిపూరకంబునందు దశదళంబులు
పది బీజములతో । పసపుతుల్యముగనుండు। విష్ణుకార్వేలు
హంసలు మహేశ॥ రొమ్మునపదియు రెండు రేకులు ద్వాదశ
బీజములతో। స్ఫటిక తేజంబునొంది । రుద్రునకు ఆర్వేలు
హంసలీశం కంఠమందున షోడశ రేకులు పదునారు బీజము
లతో । యింద్రనీలముకాంతిచె । జీవునకు నూరుపదులంస
లీశ॥ ఆజ్ఞేయచక్రమంద్దు రెండుదళములతో హంక్షం బీజ
ముల్ । మాణిక్యకాంతి గలిగి పదినూర్లు పరమహంసకు
మహేశ॥ సహస్రార చక్రమందు దశశతంబులు దళము
లోంకారము । కోటిసూర్యులకాంతిచె । గురువునకు వెయ్యి

హంసలు మహేశ॥ దినమునకు యిరువదొక్క వెయ్యారువం
దల అజపంబులు। అనయముజరుగుచుండునీపూజ అందముగ
శ్రీమహేశ॥ అణవ కార్మికమాయక మాయేయతిరోధా
నంబులైదు। మతములుగలవీని తెలియంగనలెనయ్య శ్రీ
మహేశ॥ జాగ్రస్వప్నసుషుప్తియు రాగాదు లెనిమిది భా
గుగాను। సూర్య చంద్రాగ్నులనెడి మండలము లుండును
శ్రీమహేశ॥ కామ క్రోధ లోభము మోహమదమాత్సర్య
ములు నారును। సంచితాగామి ప్రారబ్ధంబు గల్పించితివి
మహేశ॥ అండాండపిండాండముల్ బ్రహ్మాండమాదిగా
నమరియున్న। మూడువిధముల దేహము। రూఢిగా నేర్ప
రెను శ్రీమహేశ॥జీవుని స్థూలసూక్ష్మకారణము అంతఃకరణ
ములునాల్గు। యీశ్వరునిస్థూలసూక్ష్మం। కారణమ్ముమాయ
ప్రతిబింబమీశ॥ రెండునాలుగులుగలసి అష్టఅంగంబుమరి
యు నాల్గు। పాదములుగలవు దీని మోదమున తెలియవలె
శ్రీ మహేశ॥ అవిద్యసువిద్యయు ఆనందతురీయ త్రిస్థాన
ముల్। పంచదైవంబులైదుగూడి ఓంకారంబు శ్రీ మహేశ॥
పదినారువిధములుగను భాగింపనయ్యె ఓంకారంబును యిది
దెలసినట్టిజ్ఞాని॥ నిన్నంటియుండుగద శ్రీమహేశ॥ జాగ్రత
లో జాగ్రత్తయు స్వప్నంబు జాగ్రతలో సుషుప్తియు। జా
గ్రతలో తుర్యంబును గలిగుండుజీవులకు శ్రీ మహేశ॥ స్వ
ప్నంబులో జాగ్రతస్వప్నము స్వప్నంబులో సుషుప్తి। స్వ
ప్నంబులో తుర్యము జరుగుచుండును అవస్థలు మహేశ॥
సుషుప్తిలో జాగ్రతస్వప్నము సుషుప్తిలో సుషుప్తి। సుషు
ప్తిలో తుర్యము గల్పించినావుగద శ్రీమహేశ॥ తుర్యంబు

లో జాగ్రితస్వప్నము తుర్యంబులో సుషుప్తి । తుర్యము లో తుర్యమగుచు నిర్వికారరబగును శ్రీ మహేశ॥ అవస్థా త్రియసాక్షియై షోడశకళలందు మనసునిల్పి శివమంత్రము అనయము ధ్యానింపసిద్ధుల్ శ్రీమహేశ॥ చతుర్వేదముల యందుపల్కెటి నాల్గువాక్యములందున । అన్వయము దెలసి జ్ఞాని మానసపూజసల్పును మహేశ॥ యెంతని తెల్పగలను నీసృష్టికల్పననావశంబె। సుంతఫోముగియించితి నాయందు జూడు నీదయ మహేశ॥ అల్పవిద్యార్థినగుచు నీకథ స్వల్పముగ ధెల్పినాడ । చులకనజాయకిందు తప్పులు క్షమ జేయు శ్రీమహేశ॥ ఙూ మహేశ్వరశతకము యిలలోన వ్రాసి చదివినవారలు । నీ పురమునందు జేరి సాయుజ్య మొందెదరు శ్రీమహేశ॥ మంగళము పరమాత్మకు వప్పగా మంగళము సద్గురునకు। మంగళము అమరనాది। దైవములకర్పితము శ్రీమహేశ॥ ద్వితీయభాగము సంపూర్ణము.

కీర్తన-అసావేరిరాగము-మిశ్రగతి.

ఇహసౌఖ్యమునకు మోహిస్తివి । సంసారము యెటువంటిదని ఆలోచిస్తివి । బహుబంధముల కెల్ల పట్టయిన పుట్టిల్లు । నమ్మబోకుదీని నరముల హైపుండు ॥యి॥ మక్కువలరగ నమ్మించును । బహుచిక్కులలో దోయుచుంను । నిక్కముగ నీదుసారమంతయుగోరి । అక్కరమాలిన కుక్కరీతిని జేయు ॥యి॥ దారాసుతులు బంధువులు నీ వారని చాలాదగిలి వర్తింపకేమనన । పరికింప చుట్టములు పల్లీకుదొంగలు । సుతులు రుణదార్లు । అజ్ఞానమె భార్య సుమ్మి ॥యి॥ మలమూత్రిముల రోతకొంప । దీని నమ్మి

చెడుకువుగా యోచింపకలగని మేల్కొని ఫలమేమి గం
టివో । యిలలో వార్తలునమ్మి గురుపూజశాయక ॥యి॥
మట్టిబొమ్మది మాయాదేహము । దీనిగుట్టు తెలియనెంతో
యేహ్యము । వట్టియాచారములు కల్పించిగడపేవు । బట్ట
బయటనున్న భావము గనలేక ॥యి॥ నిజము నీలో గాన
నైతివి । చీచీకుజన సంగతి విడువనైతివి । భజన చేయుమి
రామభద్రుని నిరతము । రజన సహవాసము ముదమున
కోరకు ॥యి॥ దేహాభిమానమువిడువవు । మోహావేశమున
చాలాచెడుదువు । సోహంబ్రహ్మమునందు జేరుమి కొక్కెర
గడ్డ వెంకటదాసు నూహించి దెల్పెను ॥యి॥

కీర్తన–జాలికాంబోజి–ఏకతాళము.

ఆడదెలక్షరమక్షయంబు ఆడదె మోక్షంబుగదర।
నాడువేడనక నడివీధిలో గానముపాడును యదివినర ॥ఆ॥
ఆడదె ముగ్గుర్ని గూడి పంచరంగులాయె చూడుమురా ఆడ
దానినిగూడి పొందిన వాడేజగయోగనర ॥ఆ॥ ఆడదె యి
రవై అయిదుగుర్ని బహుఆశతోను గన్నదిర । ఆడదానికి
మగడులేడు । దీనర్థము తెలియవలెర ॥ఆ॥ మంచిమాట
చె పిలచినవారికి కొంచములో దొరకున । యెంచి యెన్ని
వరములునిచ్చిన చెంతజేరన్నదిర ॥ఆ॥ అరసియెన్ని శాస్త్ర
ములు చదివిన సారములేదన్నదిర । గురుకృప నొందినవా
రికి మోక్షముగురుతుదొరుకునన్నదిర ॥ఆ॥ జోడునొకటిగా
జేసినవారికి జాడజూపుచున్నదిర । వాడలెక్క యేడేడుభువ
నములు యేలుచున్నదిగదర ॥ఆ॥ ఆడగురుని పాదమందక
యాడవెతకిన లేదుర । మేడమీదగూర్చున్నది యెంతో

మెళకువగాగనవలెర॥అ॥ సారములేని సంసారములో మో సపోకుమన్నదిర ॥ దారి తెలిసినవారు కోరినవరము లిచ్చెన న్నదిర॥అ॥ చక్కగ కొక్కెరగెడ్డ వెంకటదాసు భావమిది గనర । మక్కువలర గైకొనెడువారికి ముఖ్యము దెల్పెను వినర ॥అ॥

కీర్తన-శుద్ధసావేరి-త్రిశ్రగతి.

గుప్తమైన యీ రహస్యమిప్పుడె గురుతు దెల్పెద గున - చెప్పినను నీచెవులకు యెంతో- యింపుగ వినబడున ॥గు॥మురిపెమున యీవేమునమలిన జింహ్వాకురుచియగున- గురుదెబ్బలకు లోనుగాక నీ గుణముకట్టబడున ॥గు॥ వెర్రి బోతువలె చెరించెమన సింపుగనిలచుండున - కూరిమితో జలమిచ్చిపెంచ నేలవేముకూరయగున ॥గు॥ గజముకు బుద్ధులు చెప్పగ యిలలో పెద్దలవశమగున-రజనుల నడతలు మాన్పగ నుంతయు సుజనుల తరమౌన ॥గు॥ యెలుక సింహ్వరూపంబునొంది బహుబొబ్బరింపనగున - చిలుకపలుకులు వాయసము మరి పలుకనేర్వనగున ॥గు॥ అందముగను బూరుహాము పెరిగిన చందనతరువౌన - పంది, కెంత కోరలు పెరిగినయది పెద్దయేనుగౌన ॥గు॥ దీపములెన్ని వేలునుంచిన దిక్కులువెలుగౌన - పాత్రపుగ నింగిని తారలు గాచిన - ఆపద్యోతౌన ॥గు॥ శుణకవాలముకు బద్దకట్టిన సొంపుగ నిలచున - వెంకటదాసు దెల్పెవాక్యములు వీసర బోవూన ॥గు॥

కీర్తన-ఫరజురాగము-ఆదితాళము.

దీపముండగనె మేలుకొన్న యీమకూపమునంటవు

మనస - ఆపమందున వెలిగెజ్యోతిపర మాత్మని నమ్మవె మనస॥దీ॥తొమ్మిదితూటుల తోలుబొమ్మిది నమ్మబోకుమీ మనస - నమ్మితిగా శ్రీ గురుమంత్రములో సారమెరుంగవె మనస ॥దీ॥ అన్నిటియందున నున్నదినీవె అరసి చూడుమీ మనస - పిన్నబుద్ధులువిడచి అనాత్మలొ నిన్న తెలియవే మనస ॥దీ॥ తారకమంత్రము మనసముజేసిన నరకమునంటవుమనస - నిరతము కొక్కొరగెడ్డ వెంకటదాసు భావమిది మనస ॥దీ॥

కీర్తన-బహుదారి-ఏకతాళము.

నేననెదవు నీవెవరో దెల్పుమి నిజముకనుంగొని జీవ-నేచచ్చిన పరమాత్మస్వరూపము నెంచగ నీవెకావ ॥నీ॥ దూషణభూషణతిరస్కారములు దేనివంటివో జీవ- వేషము వేసేవు నీ మాజామాల్ యిదిగొప్పనుకున్నావ ॥నే॥ కీర్తి కొరకు యీ లోకమందు దుర్మతులకు లోబడతావ - ఆర్తశరణ్యుని దలచనేరక అధికుడననుకొన్నావ ॥నే॥ దారాపుత్రి సోదరులు నీవారని భ్రమసున్నావ - మారిపొయ్యేవేళలో నీవెంటనురారని తెలియలేవ ॥నే॥ ముందిచ్చిన దానధర్మమెంతో యిపుడొచ్చునని ఎరుగావ-వచ్చేటప్పుడు వెంటనొక్క కాసైన తెచ్చుకున్నావ ॥నే॥ చాలుచాలు యీసౌఖ్యంబని యిప్పటికి మేలుకోలేవ- పాలుమాలిన పనులకుపాల్పడి కాలునిచేజిక్కేవ॥నే॥ తర్కములాడెవు పెద్దలతోను యెక్కువయనుకొన్నావ కొక్కొండ గెడ్డ వెంకటదాసు దెల్పు చక్కనితోవ॥

కీర్తన-జుజాహుళిరాగము-మిశ్రగతి.

పురాకృతంబులు యిట్లుండగ పురుషోత్తమ నిన్నే మం
దుర-దురితజాలములు దొలగించి నీదరిని జేర్చర శ్రీధర ॥పు॥
హాయగ్రీవ నీమహిమలు గనుటకు నెంతవాడను గావర -
భయముబాపి నీభక్తియందున పట్టుగనిల్పవేమిర ॥పురా॥
నాటకసూత్రధార నోటనీ పాటలు పాడనేరర ।మూటికిలోనై
ముప్పగానక మురయుచు నున్నవాడర ॥పురా॥ కూపమం
దు మండూకముగతిని గొణగుచునున్నవాడర । పాపంబులు
నెడబాపి దయతొ పరమందున జేర్చుమి భూవర ॥ పురా॥
చర్మనాటకంబిదె నిజమని నీసేవజేయకున్నానుర । కర్మబం
ధములు బాపి నిర్మలస్థానమందున జేర్చర ॥ పురా॥ పరమ
దయాకర నిరతము వేడెద భక్తుని మొరలాలింత్సర । స్థిర
ముగ వెంకటదాసునేలి నీసన్నిధియందున జేర్చర ।పురా॥

కీర్తన-సింహేంద్రమధ్యము-తిశ్రగతి.

మనసా గురుమంత్రము మరువకువె । నీదురితములె
ల్లాదొలగిపోవును ॥మ॥ మంత్రార్థము దామూలము సార
ము అంతరంగమున చింతజేయుచు ॥మ॥ అయిదక్షరముల
మంత్రం అయిదైదులిరువదైయున్నది యంత్రం । భూవిలో
దీనివివరమెరిగినవారికి భవములుబాపె మంత్రం ॥ మ ॥
పంచదశాక్షరి పఠనజేసిన పరమపదంబుదెల్పె మంత్రం ।
అంచితముగ గురుసూటిగనిన హంసాక్షరితానై పర్కె-మం
త్రం ॥మ॥ యీగుర్తెరిగె శరీరమేమిలేదని భావించె ద్వాద
శిమంత్రం । మూలములేని గుర్తుదెలసిన । యేమి లేనిది
షోడశిమంత్రం ॥మ॥ ద్వితీయాక్షరములు మనమున పఠి

తము స్మరణజేయు తారకమంత్రం। అతులితముగ శ్రీ కొక్కెరగడ్డ వెంకటదాసనుభవమంత్రం ॥మ॥

కీర్తన-బేహాగ్-ఏకతాళము.

ఎన్ని శాస్త్రములెంచి చదివిన యేమి గనరాకున్నది కన్నులోపరికించి చూచిన పున్నపెన్నెలబయలది ॥ఎ॥ ఎండ నీడలేనిచోట వెలుగులోవెలుగైనది। దండిగాములుగ్రుత్స సందులేక జగమునిండదది ॥ఎ॥ కనియు కానకనుండి స్థావర జంగములు నాడింత్సది। మానులకు సాక్షాత్కరించి మహిమదెల్పుచున్నది ॥ఎ॥ ఆరుమూడుగడచితె నను గానవచ్చునన్నది। మూడుఆరుజెందిన నామూలమెరుగరన్నది ॥ఎ॥ అంతయింతనరానిది బహువింతలమారైనది। సుంతలో గురుసూటిదెలసిన అంతతానైయున్నది ॥ఎ॥ తర్కవాదుల కెంతమాత్రము చిక్కను నేనన్నది। కొక్కెరగడ్డ వెంకటదాసుకెరుకైయున్నది ॥ఎ॥

కీర్తన-బిలహరి-మిశ్రగతి.

అందరానిపండు అతిమధురమైయుండు। మందమతులకు చాలామరుగునయుండు ॥అం॥ ఉర్వియంతయునిండి వకవిధముగానుండు। సర్వజీవులయందు సాక్షియైయుండు ॥అం॥ ముదమున దాసులకు ముక్తినిచ్చేపండు। కదలక మెదలక కడకొమ్మనుండు ॥అం॥ ఎండనీడలేనిచోట వెలుగుచుండు। కుండలాగ్రమందు చెండియైయుండు ॥అం॥ కర్మజీవులకెల్ల కానరానిపండు। నిర్మలజ్ఞానులకు నెరుకై తానుండు ॥అం॥ సోమలింగాచార్యకరుణచె యీపండు। ప్రేమచె వెంకటదాసు నేలుచుండు ॥అం॥

కీ ర్త న-హిందుస్తానీ తోడి-ఏక తాళము.

కోటతమాషాచూడన్న । బల్ మేటియైనదికోటన్న। వాటముగా నావంతర్వూలపై । వంటిగురుజుతో వప్పాగను న్నది ॥కో॥ ముగ్గురుచే నిర్మింపబడినది పంచరంగుల కోట న్న । అగ్ని నీరు మన్ను వాయువాకసములతో నమరినదో రన్న ॥కో॥ రెండు బాజులుగలవు బాజుకు ఏడుపేటలుగలవ న్న । రెండుయేళ్లు పద్నాల్గుపేటలు కోటలో నమరున్నవిర న్న ॥కో॥ స్థిరముకానిది కోట తరచిన స్థిరమైయున్నదిరో రన్న । యిరువదినలుగురు నౌఖరీలతో యేలే ప్రభువడుగో నన్న ॥కో॥ డెబ్బదిరెండువేల వీధులు హైరోడ్డాకటికలదన్న అబ్బురంబుగా రెండు అశ్వములు అటుయిటుబారునుగదవ న్న ॥కో॥ పిలనగ్రోవు భేరీమృదంగనాదిగ నాదములుమ్రోా గన్న । ఇలలో నాదధ్వనులు నెవ్వరికి విశదముగా వినరా వన్న ॥కో॥ పవనాధారము కోటన్న। యిది నవద్వారంబు లబాటన్న । భవబంధములకుచోటన్న । దీనివివరముగన బూటకమన్న॥కో॥ మూడుమూలలకోటన్న మూడుమూరల పొడవన్న । కోటకవాటము దీసెనేర్పు కోవిదులకు నెరు కానోరన్న ॥కో॥ కోటకు నగ్రిభాగమందున నూతిగట్టుపై నాతన్న । నాటినెత్తిని మర్కటమున్నది నయముగ గనరా వోరన్న ॥కో॥ మర్కటమస్తకమందున జ్యోతివెలుగుచు న్నది చూడన్న । కొక్కెరగెడ్డ వెంకటదాసు మక్కువలర గన్నదిరన్న ॥కో॥

యుక్తి కీర్తన-హిందుస్తానీ భైరవి-అట తాళము.

బట్టబయలై యున్న దీనిగుట్టుదెలసుకొనరయ । ని

ష్టనీమముగానిది యిది నట్టిభ్రాంతిగదరయ ॥బ॥ కొండపొ
డవు ధేనువునడినెత్తినెన్నో కొమ్ములుండును । మేతమెయ్య
దు బాటబారదు పితకబోతె కటిక స్తనములు । పూటకడ్డె
డుపాలునిచ్చును ॥బ॥ సంధ్యరాగము పరిణమాయె అర్ధ
రేయికి చూడిదాయె । వేకువున శిశుజన్మమాయె । భానుదీ
ప్తికి నామమిడిరి ॥బ॥ తల్లిని పొయిలోనబెట్టి పిల్లను పొయి
మీదబెట్టి । మెల్లగాపచనంబుజేసి యుల్లమలరగ భోంచే
స్తురు ॥బ॥ మృత్తురసములు గూడుకొని బహుగుప్తమగు
వస్తువులునాయె । కాష్టఅనలమునందు తప్తము । కాగనున్న
అప్పుతీరెను ॥బ॥ ఖండించెవారు కొందరన్న ల్లేటివారుకొం
దరన్న । ఖండనజేసిన జీవులు కొండకెక్కి మేసునన్న ॥బ॥
సారసారలమేకము సిరమున ఘోరమగు శృంగంబుగలదు
శిఖరమందున చీరగట్టి పగలబడుచు బారునయ్య ॥బ॥ కా
ళ్లులేని కంచిమేక కదలకనిలుచుండి జనులకు । స్తనములు
లేకుండ దేహమునందు క్షీరములొసగుచుండును ॥బ॥ దేహ
మంతయు కంఠ్లుగలదొక దీనజంతువు నరునిమీదాధోహ
ణంబై జీవులాను వెదకిచంపుచుండునయ్య ॥బ॥ గగనమం
దున బుట్టిపెరుగును గర్భమెల్ల తేటాకమగును ॥ మూడుక
న్నులవేల్పునూనుకు ముఖ్యమగు నాహారమయ్యె ॥బ॥ అండ
జంబై నుద్భవించి వేకువందున పొద్దుదెల్పి । ఢీకొనియు
ద్ధంబునల్పి కేకవేసి ప్రాణమిడచును ॥బ ॥ గోగన్నమరపు
రవాసు కొక్కెరగెడ్డ వెంకటదాసుభావము । బాగుగాచె
ల్పెను దీనర్ధంబుజెప్పడి యోగులార ॥బట్టు॥

కీర్తన–ఇందుస్తానికాపి–త్రిశ్రగతి.

అదిగో వైకుంఠముచూడండిదిగో కైలాసం । మోద మలర శ్రీలక్ష్మీరమణ వేదవేద్యుని పురము చోద్యము॥అ॥ వేయురేకుల పీఠమందున చాయకోటిభానుదీప్తినొందగ । వాయురూపమున సకలజీవులలో వర్తించె నారాయణపుర ము ॥అ॥ భేరిమృదంగాది వాద్యములతో – దశనాదంబులు ధణధణమోగ్రియుగ – నీరజనేత్రుని దివిజులు పొగడగ । వరము లొసంగిన హరి నగరంబు ॥ అ ॥ శృంగారం బగు బంగరుమేడలు– కెంపులు దాపిన దూలంబులుమరి – యింపుగజెక్కిన వజ్రింబులుగల స్తంభంబులతో రంగుగ వెలిగెడి ॥అ॥ వాడవాడలగల పురంబువర్ణించిచప్ప నాక లవిగానిది । ఏడుకొండలెక్కిచూడకాయాపురము చోద్య ముగానవచ్చును ॥అ॥ ఆహాహా నేనేమని దెల్పుదు అలవి గాని యాంపూలవనములు । సోహంబనె హైరోడ్డునడచిన సులభముగానది గానవచ్చును ॥అ॥ ఏడుమెట్ల సోపానము లోన వెలుగులోనకడు వెలుగై యున్నది । చూడచూడబ హుచోద్యంబై నది– వెంకటదాసువేడుకగన్నది ॥అ॥

ఫీల్వారాగము– శ్రీరామాయణఅంతరార్థము–ఏకతాళము.

రామాయణములోరహస్యమిది – యేమారక వినుడీ జనులార । నేనుమెప్ప వాల్మీకిరచించెను – ఆత్మభావమిది బుధులార ॥రా॥ మోక్షానందంబనె అయోధ్యలో– పరబ్రహ్మమనె దశరథరాజుకు । జ్ఞాన ఇచ్ఛక్రియశక్తులు ముగ్గురు– భార్యలు వారిలో । జ్ఞానమనెడి కౌసల్యగర్భమున– వాత్మారాముండవతరించెను ॥రా॥ అవ్యక్తంబనె బాల్యావ

స్తుచె దననిజరూపము మరచియుండియు । యజ్ఞానంబనె జీవుడు తానని । భ్రమసి దేహేంద్రియ ప్రపంచము-నభిమానముగాయుండగనపుడు ॥రా॥ వసిష్ఠోపదేశము-న మనన మున తన్ను దెలసి వైరాగ్యమనెడి లక్ష్మణునితోడ్కొని । మననమనెడి విశ్వామిత్రునితో- బయలుదేరి। పంచమహాపాతకమనెడి పర్వతంబులు వడిదాటెను ॥రా॥ జ్ఞానమనెడి తీక్ష్ణబాణమునచె- మాయశక్తియనె తాటకిద్రుంచి । ఇచ్ఛయనే మారీచుని వనధిలోముంచి- సదాచారమనె అహల్యశాపముబాపి వనితగజేసెను ॥రా॥ ఏకాంతమనె మిథిలాపురము । వేంచేసి శాంతమనె జనకునిగాంచి । యసూయనె హరునివిల్లువిరచి । యానంద మనెడు సీతను పెండ్లాడెను ॥రా॥ మదమనెడి యా పరసురాముని । భంగపరచి మోక్షానందంబనె అయోధ్యజేరి । జీవత్యాగమనె పట్టాభిషేకము కర్తుండుగాగ । క్రియాశక్తియనె కైకవలన । జపలత్వమనెడి విఘ్నముగలిగించెను॥రా॥ మోక్షమనెడి అయోధ్యవిడచి । యానందమనే యా సీతతోడను । వైరాగ్యంబనె లక్ష్మణుగూడి । బయలుదేరి చిత్తమనే సరయూనది దాటెను ॥రా॥ బుద్ధియనెడి గుహునితో నిక్షేపంబనెడి । మహారణ్యంబునజేరి । తపమనెడి యా చిత్రకూటమున । అహంకారమనె యా విరాధుని బలిగానిచ్చి । మననమనెడి కాకాసురునివధించెను ॥రా॥ సంకల్పంబనె కంకణముగ్రుచ్చి। నిర్వికల్పమనె కంకణనిచ్చి వీర్యమనెడుయాయగస్త్యమునిని। నాశ్రయించి ధైర్యంబనెయస్త్రము । బ్రయోగించి కామమనెడి శూర్పణఖ।నాసికకర్ణంబులు తెగనరికివేసెను ॥రా॥

ఆగామికర్మములనె మారీచునివంచింపగ । రాజసమనె యారావణుండు । దంభమనెడి సన్యాసివేషము । ధరించి యానందమనె సీతను మ్రుచ్చిలిగొనగ । యానందమనె సీతను గానక । వైరాగ్యమనె లక్ష్మణుగూడి । నిక్షేపంబనె నరణ్యము జేరెను ॥ రా ॥ వివేకంబనె జటాయువును సద్గతినొందగజేసి । చింతయనెడు కబంధునివధియించి । సంతోషమనె శబరిపూజనంగీకరించి నిధిధ్యాసమనె హనుమంతుని దోట్పరచి। భయమనెడి యావాలిని జంపెను ॥రా॥ నిర్భయమనె సుగ్రీవ రాజును ఆదరించి । నిధిధ్యాసమనె హనుమంతునిబంపగ । మోహమనె యామహాసముద్రముదాటి లోభమనె లంకకుచేరి । దుర్వాసనలనె రక్కసుల ద్రుంచెను ॥ రా ॥ ఆనందంబనె సీతనుజూచి । సంకల్పంబనె యశోకవనము నాశముజేసి । అజ్ఞానమనెడి యాజంబుమాలిని । భూతిజేసి సంశయమనె నక్షుని శిక్షించెను ॥రా॥ విపరీతముయనె ఇంద్రజిత్తుని దిరస్కరించి । భ్రమయనె పాశముద్రెంచి । రాజసమను రావణుధిక్కరించి । మానమనె మహాగ్నిజ్వాలింపగజేసి । లోభమనె లంక దగ్ధపరచెను ॥ రా ॥ మోహమనెడి వారధిని దాటి । ఆనందమనె సీతను దరిసించి । ఆత్మయనెడి రాములతో దెల్పగ । ఆత్మారాముడు బయలుదేరి । మోహమనె వారధి భంగపరచెను ॥రా॥ నిశ్చలమనె సేతువబంధించి । ధర్మమనెడి యావిభీషణునకు । శరణమొసంగియు విపరీతంబనె ఇంద్రజిత్తును యెదిరించి । సందేహమనె నాగుపాశము నగట్టుబడెనుగ ॥రా॥ సద్విచారణనె గరుత్మంతునిచెవిడువబడగ । తామసమనె కుంభకర్ణునిద్రుంచి । భ్రమయనునస్త్ర

ముచే । వైరాగ్యంబనె లక్ష్మణుండు మూర్ఛజెందగ । నిధి ధ్యాసమనె ఆంజనేయుడు । సంజీవినగము దెచ్చి యిచ్చెను॥ రా॥ వైరాగ్యంబనె లక్ష్మణమూర్ఛనివారింపగ । విపరీతం బనె ఇంద్రజిత్తుని దునిమి । సంచితమనె మూలబలమునెల్లను సాధనంబనె మోహనాస్త్రమున నిర్మూలముచె । దుర్వాస నలనె యసురులనెల్ల నాశపరచి । సద్వాసనలనె కపిసైన్య ముల నాదరించెను ॥రా॥ గాంభీర్యమను ధనసుచేబట్టి రాజ సమును రావణు నెదిరించి । జ్ఞానమనెడి దివ్యబాణమున । యీ యహంకారమనె యమృతకలశము గదలింపగ । దశకం ఠ కామక్రోధలోభ మోహమదమత్సర । దంబదర్ప యీ ర్ష్య అసూయలను పదిసిరములు ద్రుంచెను ॥ రా ॥ యానం దంబనె సీతనుగైకొని । మోక్షమనెడి అయోధ్యకు నేగి । జీవత్వనివర్తియనె పట్టాభిషేకమువహించి । బ్రహ్మమనెడు దశరథుడు తానెయై । కేవలబ్రహ్మ సాక్షాత్కారము । రాజ్యముచేయుచునుండెను రాముడు ॥రా॥ యీరహస్యము యిలలో గోగనమురపుర వాసుడు కొక్కొండగెడ్డ వెంకటదా సు । మక్కువలరగ అంతర్భావము । గనినంతయు చెల్పె ను మోదంబున ॥రా॥

వ॥ కావున యిందునతప్పులు నెంచక । వప్పులుగా భావించి దీనిరహస్యార్థము అరసి మన్నించెదరని కోరు చున్నాడ.

గీ॥ హంసలున్నట్టిచోటున బకములుండు । కోవెలలునుండు
చోట శారికములుండు । సింహ్వములు నుండుచోట
మూషకములుండు । నట్లు నాకవిలో తప్పులుండుగాక॥

గీ॥ బకమున్న మరాళంబు వరువు బోనె । శారికము లున్న
కోవెలల్ పలుకుచెడునె । మూషకము లున్న సింగంబు
ధాటిబోనె । తప్పులున్నను సద్భక్తి తక్కువౌనె॥

కం॥ పునరుక్తి ప్రాసతెల్లను । గనిబ్రాయగ లేదు భక్తికారణ
మని నా మనమున దోచినవిధమున । నిను ధ్యానము
చేయుచుంటి నీరజనేత్రా॥

కం॥ శ్రీరాజయోగి గొత్తె । సోమాలింగార్యులతను సేవకు
డయ్యున్ । పరమేశుని కృతిచె । యీ శతకము రచి
యిస్తి బుధులు సంతసమొందన్॥

మంగళహారతి–శుద్ధబంగాళా–త్రిశ్రిగతి.

హారతిగొనుమ సీతారామ । మారజనక మమ్మేలు
మి ప్రేమ । కూరిమితో నీదాసుల కెల్లను। పారమార్థికాశం
బొసగిన దేవ ॥హా॥ మందరగిరిధర యిందిరరమణ । సింధు
శయన గోవిందమురారె । నందనంద గోపాల ముకుంద ।
యాదవకుల యశోదానంద ॥హా॥ జగన్మోహన యఘము
లు బాపుమి నిగమగోచర నిన్ను నమ్మితిని । ఖగరాడ్వా
హన కరుణాసాగర।పగవాడనయిటు పంతముంచకను॥హా॥
పెక్కులుపొగడగ నేరను నన్ను । చిక్కులుబెట్టకు చిన్మయా
కార । అక్రూరుని పాలించిబ్రోచినటు । గ్రక్కున గావవె
మక్కువలరగను ॥హా॥ ధరగోగనమర పురమున వెలసిన
దానవాంతక దశరథరామ । ముదిమమున యీ కొక్కెర
గడ్డ । వెంకటదాసర్పించిన శర్వర ॥హా॥